ఆ మార్పును నేను ఏ సంశయాలూ లేకుండా భగవదాజ్ఞగా భావించి శిర సావహించి ఆయన ఆజ్ఞాపాలన చేశాను, అంతే నా కోరిక ప్రకారం నడచు కోనేటందుకు నేనెవర్ని? నా కృషిలోని ప్రతి అంశమూ ఆయన కర్పిం చిన పూజాప్రసూనమే "యద్యత్కర్మకరోమి తత్తదఖిలం-తవారాధనం" అనికదా సత్పుజ్ఞుల భావన. సంప్రదాయ దృష్టితో ఆలోచించి పరిశీలిస్తే రాజకీయాలు రాజకీయాలు కావు. అవి సేవా కార్యక్రమాలు అని నేను వినయ పూర్వకంగా అంగీకరించి నిర్వహించిన ధ్యాసం, దరిద్ర నారా యణ సేవా అనే కార్యక్రమాలు. ఇది తాత్కాలికమైనదనీ ఏనాడో ఒక నాడు పరిసమాప్తిగుకు పోయేదేననీ నేనెఱుగుదును. కార్మికుడైన, కర్మయోగి చేసే పనిలో ఒక పనినుంచి మరోపనిలోకి మార్పు కలగవచ్చు కాని, శ్రద్ధలో అనాసక్త యోగ భావనలో లగ్నమై ఉన్న అతని హృదయం అనవరతము (ఎప్పుడూ) ఒకేతీరుగా ఉంటుంది ఎప్పుడు భగవంతుడు సంకల్పిస్తే అప్పుడు నాకు రాజకీయ కార్యకలాపాల నుంచి తక్షణమే విముక్తి సిద్ధిస్తుందని నాకు తెలుసు

పార్లమెంటరీ కార్యక్రమాలు మానుకోవాలనే కోరిక నాలో క్రమంగా బలపడ సాగింది. నా సహజ స్వభావానికి అనురూపమైన మరో కార్య క్రమం చేపట్టాలని తోచింది. అందుచేత మూడో సాధారణ ఎన్నికలకు కాల నిర్ణయం జరగడానికి చాలా ముందుగానే ప్రధాన మంత్రికి నేను ఎన్నుకొన్న క్రొత్త పంథా గురించి వ్రాత మూలకంగా తెలియ జేస్తూ అందులో అడుగిడి ముందుకు సాగేటందుకు అనుమతి ఇవ్వవలసిందని కోరాను ఆయన సహజ సౌజన్యంతో నా కోర్కెను అంగీకరించారు.

అందుచేత నా పథంలో మార్పు నిర్ధారణ అయ్యింది అంతరాత్మ ప్రగాఢమైన ఏకాంతాన్ని తిరిగి ఎన్నుకోమని అంటోంది ఆ ఏకాంతం కళ్లు మూసుకొని కూర్చునే నిశ్చల ధ్యాన సమాధి కాదు, చైతన్య రహితమైనది

అసలే కాదు దృష్టి గోచరమయే కర్మ స్వరూపం, నిరంతర సాధనా రూపమైన ధ్యానము. అది ఏదైతేనేమిటి, నాకు వివేకానంద స్వామి చెప్పిన "నీ ముందున్నవన్ని భగవంతుని అనంత రూపాలే వాటిని తోసి పుచ్చి భగవంతుణ్ని ఎక్కడ అన్వేషిస్తావు? ఎక్కువ తక్కువలు మైత్రీ శత్రుత్వాలు లేకుండా సర్వ జీవ కారుణ్యంతో, ప్రేమానురాగాలతో ప్రవర్తించిన వాడే యథార్థంగా భగవంతుణ్ణి ఆరాధిస్తున్న వాడు" వాక్యాలే ధ్రువ తార వంటివి.

—·o —

# అనుక్రమణిక (Index)

# సవరణలు

| పేజీ | లైనులో | |
|---|---|---|
| 15 | 25 | "ఎట్లాగైతే నేమి" అన్నది తొలగించండి. |
| 50 | 25 | 'ఆయన' తర్వాత 'ముఖంలో' అని చేర్చండి. |
| 54 | 22 | 'భావించి" అన్నది "అనుభవించి" గా సవరించండి |
| 61 | 12, 13 | చివరి వాక్యాన్ని "ఈ ఆలోచనలు అన్నీ నాకు అప్పుడు వచ్చేవి. అయినా ఆయనను వదలకుండా ప్రార్ధన చేసేవాడ్ని" అని సవరించండి. |
| 107 | 1, 2 | "శ్రీనారాయణరావు జోషి, దేశాభ్యుదయానికై దీక్షవహించిన వారూ హిప్పర్గి గ్రామం వారూ అయిన శ్రీ వెంకటరావు సోదరులు" అని సవరించండి |
| 137 | 3 | "సాగడానికి తగిన బలం పొంది ఫలితాలు సాధిస్తుందనే తత్వాన్ని" అని సవరించండి. |

# ... ఈ గ్రంథాన్ని గూర్చి ...

హైదరాబాదు రాష్ట్రాన్ని ప్రజాస్వామీకరించి, భారత యూనియన్‌లో విలీనంచేసే నిమిత్తం నైజాంకు వ్యతిరేకంగా జరిగిన పోరాటం చరిత్రాత్మకమైనది స్వామి రామానందతీర్థ ఈ పోరాటానికి స్ఫూర్తినిచ్చారు. వ్యవస్థీకరించారు, నాయకత్వం వహించారు. ఆధునిక భారతదేశచరిత్రలోని సుదీర్ఘము, సుప్రసిద్ధము అయిన ఈ అధ్యాయానికి సంబంధించిన స్వామీజీ జ్ఞాపకాలను ఈపుస్తకంలో గ్రంథస్థం చేశారు.

స్వామీజీ చిన్నతనం నుండే వైరాగ్యం వైపు ఆకర్షితులైనారు నవ యవ్వనం లోనే సన్యాసాశ్రమాన్ని స్వచ్ఛందంగా స్వీకరించారు అయినప్పటికీ హైదరాబాదులో ఆనాడు నెలకొని యున్న పరిస్థితుల ప్రాబల్యం కారణంగా రాజకీయ కలాపాలలో నిమగ్నులు కావలసివచ్చింది.

మోమినాబాదులో స్వామీజీ 1937లో స్థాపించిన విద్యాలయం నుండే నైజాం నిరంకుశ పరిపాలనకు ప్రతిఘటన [illegible] తరువాత క్రమేణా గాంధీమహాత్ముని నాయకత్వంలో మిగతా భారతదేశంలోజరిగిన స్వాతంత్ర్యోద్యమం వల్ల స్ఫూర్తిని పొంది, ప్రతిఘటనా ప్రే[illegible] ఇతర రంగాలకు కూడా విస్తరించింది

భారతదేశానికి స్వాతంత్ర్యం లభించటం, హైదరాబాదు రాజ్యాన్ని భారత దేశంలో [illegible] వ్యతిరేకించడం హైదరాబాదు ప్రజాపోరాటాన్ని తీవ్రతరం జేసినవి మజ్లిస్ ఇత్తెహాదుల్ ముసల్‌మీన్ మత దురభిమానంతో సైన్యం మోస్తరు సాయుధంగా తయారయి ప్రజలను హింసలకు [illegible] భారత ప్రభుత్వం జోక్యం చేసికోవటానికి దారి తీసినది భాషాయుక్తంగా రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ తర్వాత హైదరాబాదు రాష్ట్రం విచ్ఛిన్నం అయింది. భారత దేశ చరిత్రలో ముఖ్యమైన ఈ ఘట్టానికి సంబంధించిన సన్నివేశాల వెనుక నడచిన తతంగాలను పాఠకుని దృష్టికి మొట్ట మొదటి సా [illegible] కం—.